# గోలకొండపత్రిక

103534

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపబడును.

REGISTERED No. N. 45 హైదరాబాదు—దక్కన్. REGISTERED No. M. 2136

సంపుటము ౨ { ప్రభవ సంవత్సర కార్తీక బ॥ ౧౪ బుధవారము (౨౩ నవంబరు ౧౯౨౭) { సంచిక ౫౪

## విశేషములు

### ఆహారమార్పు

ఒక ఇంగ్లీషు పాదిరీగారు రోగము కుదుర్చుటకు శీతోష్ణాది స్థితులలో మార్పుగావించుటకు బదులు ఆహారము, ఇతర సామానులు మార్చవలయునని చెప్పుచున్నారు. వారీవిధముగ రోగులను కుదిర్చువారట. వారు రోగియుండుగదిని పరీక్షించి పటములను, మేజా కుర్చీలను, ఇతర సామానులను ఒకచోటినుండి వేరొకచోట నుంచెదరట. ఆహారములో మార్పు చేయుటకై చెప్పెదరట. రోగి పఠించు గ్రంథములనుకూడ మార్చెదరట. దీనివలన రోగిస్థితి మార్పుచెందునట. ఒక రోగిని అచటి శీతోష్ణాది స్థితులనుమార్చుటకు వేరొక ప్రదేశమునకంపిన అచట ఆరోగ్య గృహమునందు నుండుటచే అతనిస్థితి మార్పుచెందును. ఇదేవిధముగ పై పాదిరీగారు ఆగదినే వేరొకగదిగ చేయుచున్నారు.

### ధనవంతుల తెలివితేటలు

ఒక యూరోపియన్ ధనికురాలు తెల్లపిల్లిని సాకుచుండెనట. కొన్నాళ్లకది చనిపోయెను. దానికి ఆమె స్వర్ణపేటిక చేయించి సమాధిచేసెను. పిల్లి అంత్యక్రియలకు ౧౫ వేల రూపాయలు వ్యయమైనవట. ఈ సొమ్ము బీదలకొసంగియున్న యెంత మేలుకలిగియుండెడిది.

### కాలము లెక్కించు గుఱ్ఱము

ఒక స్త్రీవద్ద నొక గుఱ్ఱము కలదు. దీనియెదుట గడియారముంచి యెన్నిగంటలని యడిగిన అది యెన్నిగంటలో చూపుటకు అంకెలున్న పలక పెట్టును. ఒక కాగితముపై పేరువ్రాసి ఆ గుఱ్ఱము యెదుట నుంచిన ఆపేరు యెట్లు వ్రాయవలయునో చూపును. ఇంతియేకాక ఈ గుఱ్ఱము చిన్నచిన్న లెక్కలుకూడ చేయగల్గునట.

### శ్వాసనాపుట

యూరోపు ఖండమున నొక కాలేజి విద్యార్థి శ్వాస పదునాలుగు నిమిషములు, రెండు సెకెండ్లు నాపగలడట.

### ఇంగ్లీషు యువకుల ధైర్యము

ఇరువురు ఇంగ్లీషు యువకులు భారతదేశమునకు వెడలియున్నారు. వారు ఇంగ్లీషు చానెల్ దాటుటకు సుఖప్పు తప్ప ఇంకేమియు గైకొనలేదు. వారు యూరోపు యాత్రగావించి ఇచటికి వచ్చెదరట. వ్యయము కొరకు తమ విజ్ఞానము మూలమున సంపాదించెదరట.

### మహాభారతము

మహాభారతము జపానుభాషలోనికి తర్జుమింప బడుచున్నది.

### వివాహచ్ఛేదములు

అమెరికా సంయుక్త రాష్ట్రములలో ౧సంవత్సరము ౧౧౮౧౮౯ వివాహములు జరిగినవి. ౧౬౫౬౪౧ వివాహ సంబంధములు తెగిపోయినవి.

### భార్య విజయమునొందుట

ఇంగ్లండునందు సౌతుఎండ్ (South-end) ఎన్నికలలో భార్యభర్తలు నిలచిరి. భార్యకే అధిక సమ్మతులు వచ్చుటచే విజయమునొంది పార్లమెంటు సభ్యురాలయ్యెను.

### ఒక అమెరికను యాత్రికుడు

ఒక అమెరికా దేశీయుడు పత్రికలతో చేయబడిన దుస్తులు ధరించి పర్యటనము చేయుటకై వెడలెను. కాగితములు దప్ప అతనివద్ద యేవస్త్రమును లేదు. న్యూయార్కునుండి ప్రపంచమంతయు ఐదు సంవత్సరములలో చుట్టి వచ్చుటకై తలంచెను. ఇతడుపన్యాసములు కొసంగి ప్రయాణ వ్యయమునకై ౧౫ వేల రూపాయలు సంపాదించెనట.



గోలకొండ పత్రిక

ప్రభవ సంవత్సర కార్తీక బ॥ ౧౮

బుధవారము

## వస్త్రపరిశ్రమ

హిందూస్థానమున వస్త్ర పరిశ్రమ పందొమ్మిదవ శతాబ్దారంభము వఱకున్నత స్థితియందుండెను. ఆ కాలమున యెట్టి వస్త్రములు తయారగుచుండెనో తెలిసికొనుటకు యీ వారము యంగు ఇండియా పత్రికలో ఒక ఇటలీ దేశీయునిచే పదునెనిమిదవ శతాబ్దమున వ్రాయబడిన గ్రంథమునుండి ప్రకటింపబడిన విషయములు గమనింపదగి యున్నవి. కొలదిరంగుల సహాయముతో, మేలైన రంగువస్త్రములు తయారగు చుండెననియు ఆ కాలమున యూరోపు ఖండమునందెచట నయినను అట్టి నాణ్యమయిన వస్త్రములు లభింప కుండెననియు, అతడు దెలుపుచున్నాడు. నూలు వస్త్రములు మాత్రమే యిరువదినాలుగు రకములవి యుండెనట. ఇట్టి మేలైన రకపు వస్త్రములు తయారు జేయుటకు ఫ్రెంచి, ఇంగ్లీషు, డచ్, మున్నగు పాశ్చాత్య దేశీయులు యెంతో కష్టించిరట. కాని తుదకు విఫల మనోరథులయిరని ఇటలీ దేశీయుడు వ్రాయుచున్నాడు. మచిలీ పట్టణమునందు అరగడి పేరున ప్రసిద్ధిబడసిన చీటిబట్టలు యూరోపు టర్కీ, పర్షియా దేశములలో అనుకరించుట కెవ్వరికి సాధ్యము కాలేదట. అందుచే రంగులు వేయుట, నేయుటయందు భారతీయులతో సరిసమానులు ప్రపంచములో లేకుండిరని అతడు అభిప్రాయ పడియుచున్నాడు. ఆ కాలమున అరేబియా, పర్షియా దేశముల నుండి దూది తేబడి భారత దేశపు దానితో కలుపబడు చుండెను. అపుడు మచిలీపట్టణము, చెన్నపురి, పుదుచ్చేరి, నాగపట్టణము, వంగదేశము, మున్నగునవి వస్త్రముల పరిశ్రమకు కేంద్ర స్థానములుగ నుండెను. ఈ ప్రదేశములనుండి వస్త్రములు విదేశములకంపబడు చుండెను.

ఈ ఇటలీ దేశీయుడు తన మాతృదేశము వస్త్రములకొఱకు హిందూస్థానముపై యాధారపడి యున్నదనియు, హిందూ దేశపునూలు వస్త్రములు తనకుపయోగపడుచున్నను, తమ ఉన్ని బట్టలు భారతీయుల కక్కర లేదనియు, విలపించి యున్నాడు. స్వదేశ ధనము విదేశముల పాలయ్యెనని వ్యాకులపడి యున్నాడు. తమ దేశముయొక్క అక్కరలు దీర్చుకొన జాలని ప్రజలు వ్యర్థులని నిందించి యున్నాడు.

ఆ కాలము నాటి పరిస్థితులు మారినవి. భారతీయులు జీవితావసరములలో రెండవదియగు వస్త్రములకే ఇతర దేశములపై నాధారపడ వలసినవారైరి. నిజముగ తమ దేశముయొక్క అక్కరలు దీర్చుకొన జాలని ప్రజలు వ్యర్థులు. అక్కరల కంతము లేదు. కాని ముఖ్యావసరముల కొఱకుగూడ విదేశీయుల దయా ధర్మముపై ఆధారపడి యుండవలయునా? కష్టించి సంపాదించిన ధన మితరులపాలు చేయవలయునా? తాము దరిద్ర దేవతను ఆశ్రయించ వలయునా? ఇంతియే కాదు బానిసలుకూడ గావలయునా?

నిజము విచారించిన ఈ వస్త్ర పరిశ్రమ వలననే హిందూ దేశముయొక్క రాజకీయ పరిస్థితులు తారు మారైనవి. పరిశ్రమ విదేశీయుల హస్తగతము జేసినట్లు తమ దేశమునుకూడ వారిచేతులలో బెట్టిరి. తాము సోమరులై కాలము గడుపజొచ్చిరి. కాని ఇట్టి పరిస్థితు లెన్నాళ్లుండును? కొన్ని సంవత్సరములనుండి వస్త్రపరిశ్రమ మఱల తలయెత్తుచున్నది. మహాత్మా గాంధీగారి కర్ద రుద్యమము దీనికెంతయు మార్గదర్శకమయినది. ముతుక వస్త్రములు తయారగు చున్నవి. భారతీయుల అవసరము కొంతవఱకు తీరుచున్నది. ఇపుడుకూడ అచటచట పూర్వపు సన్నని వస్త్రములు తయారగు చున్నవి. కాని జపాను, ఇంగ్లండు, వారు దీనిని సహించజాలకున్నారు. వారు తక్కువ వెలలకు తమసరకు పంపుచున్నారు. విదేశపు పోటీనుండి మిల్లులను రక్షించ వలయునని ప్రభుత్వము వారిని యజమానులు కోరినను వారి విన్నపము తృణీకరింప బడినది.

ఇట్టి పరిస్థితులయందు భారతీయులు చేయ వలసిన పని యెంతేనిగలదు. వారు ముఖ్యముగ విదేశ వస్త్రములను బహిష్కరించ వలసి యున్నది. స్వదేశ వస్త్రములకు ప్రోత్సాహ మొసంగవలసి యున్నది. భారతీయులు బి యస్ భరుచాగారి సందేశము గమనింపవలసి యున్నది. వారొక రాజకీయ బహిష్కరణము వలన దేశమునకు ముక్తి కలుగగనియు, ఆర్థిక బహిష్కారము కూడ అవసరమనియు, అందుకొఱకు స్వదేశీ బజారులు ప్రతి మాసము జరుప వలయుననియు, సూచించు చున్నారు. వస్త్ర పరిశ్రమ అభివృద్ధి జెందుట కిట్టి ప్రదర్శనము లవసరములై యున్నవి. చౌకయనియు నాణ్యమయినవనియు, విదేశ వస్త్రముల ఉపయోగించుట దేశద్రోహము. కొను వారు హెచ్చిన కొలదియు, పరిశ్రమ అభివృద్ధి జెందిన కొలదియు, ధర చౌకయగును. సన్నని మేలైన వస్త్రములు తయారగును. ఇక నయినను భారతీయులు తమ విధ్యుక్త ధర్మము దెలిసి కొనెదరా?

## గ్రంథాల యోద్యమ ప్రచారము

శ్రీయుత లోకేగారి లక్ష్మణ శర్మగారు కేంద్ర సంఘము పక్షమున గ్రంథాల యోద్యమ ప్రచారమునకు గాను పంపబడు చున్నారు. ప్రస్తుతము వీరు మేడిచలము, తూప్రాను, పెద్దపల్లి, మెదకు, కామారెడ్డి, దోమకొండ, రాజంపేట, చిన్నమల్లారెడ్డి, నిజామాబాదు, ఆర్మూరు, బాలకొండ, నిర్మల మున్నగు ప్రదేశములను దర్శించెదరు. వీరివద్ద కేంద్రసంఘము వలన ప్రకటింపబడిన లఘు పుస్తకములును, నిజాం రాష్ట్రముయొక్క జనపరిగణనము పుస్తకములును, నిజాము రాష్ట్రములో వెడలుచున్న పత్రికల నమూనాలును ఉండగలవు. గ్రంథాలయాధి పతులును ఆంధ్రభాషాభిమానులును వీరి సేవను నుపయోగించుకొన ప్రార్థితులు.

ఆంధ్రకుటీరము
హైద్రాబాదు
౧౮—౨—౩౭

మాడపాటి హనుమంతరావు
కేంద్రసంఘ
కార్యదర్శి.

### మోటారు ప్రమాదములు

సోమవారం సాయంత్రము నాలుగు గంటలకు నాంపల్లి హైస్కూలు బ్రాంచి ముందర నొక మోటారు బట్ల బండికి ఢీకొనెను. బట్లు క్రిందపడి ముక్కలు ముక్కలయ్యెను. దానితో నున్న ఒక ముసలాయనకు చేయి విరిగెను. మోటారు ముందున్న అద్దము బద్దలై గుఱ్ఱమునకు చాలా గాయములు తగిలెను. గుఱ్ఱము చచ్చిపోయెను. పాపము బట్లవానికి చాలా నష్టము వాటిల్లినది.

సోమవారమునాడు సికింద్రాబాదు సరోజిని నైస్కూలు విమానశ్రయ గంగారాం పాయింటు మోటారు బట్లబండికి ఢీకొనెను. గుఱ్ఱమునకును బట్లవానికి కూర్చున్న వారికిని గాయములు తగిలెను.

REG. No. N. 45. REG. No. M. 2185

గోలకొండ పత్రిక
కార్యస్థానము హైదరాబాదు, దక్కన్.
సంవత్సరము చందా రు. ౭-౦-౦
అర్ధసంవత్సరము ,, ,, ౩-౧౨-౦
విడి ప్రతి ౦-౧-౮

Printed and Published by S Prathapa Reddy, at the Golkonda Press, Troop Bazaar, Hyderaba